The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper
for H. E. H The Nizam's Dominions.

# గోలకొండపత్రిక

తూప్రబజారు, హైదాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

సం॥చందారూ ౬-౦-౦
అర్ధ „ „ ౩-౦-౦
విడి ప్రతిక ౦-౧-౦

# GOLKONDA PATRIKA

HYDERABAD, Dn.) THURSDAY 1-11-1934

ప్రాతపత్రికకు
వెల ప్రత్యేకము

సంపుటము ౬ } శా.శ.౧౮౫౬ శ్రీభావనామసం॥ ఆశ్వీయుజ బ॥ ౧౦ గురువారము ౨౭-౧-౪౪ఫ. { సంచిక ౪౫



భజనికులు, ప్రచారకులు, సాత్వికపూజ జేసినవారిఫోటో




వీరు గతవత్సరము నీయేడున్న సాత్వికపూజచేసిరి.
గౌలీపూరా. (బేరూన్ దర్వాజా)

౬. పిదప దేహదార్ఢ్యమును
  పిదప విద్యల నేర్పు శ్రద్ధయు
పిదప వాక్పటుత్వమును
  పిస్థిర దివ్య మతాభిమానమును
పిదప స్థైర్యము స్మృతియు
  పిదప సదాచరణా ప్రమత్తతన్
పిదప సువ్యాప్తంబు సెట
  నేరుము గాంచగ నింక దిర్మలా!
౭. పరమపదంబుఁ జెందిరిగ
  వైష్ణవ సన్మత మూర్ధవాసిలిన్
వారికి దయార్ద్రచిత్తునకు
  సంతతముఁ దెల్పియు నుద్ధరింపుమా
త్వరగ నటంచు వేడుచును
  దద్దయు నిత్యము భక్తి యుక్తిచే
స్థిరమలతోడ తచ్చరణ
  సేవను జేయుచు కాంలసొందుమా

——

# సమకాలికాభిప్రాయములు

## నగరపు ఎన్నికలు

——

పురపాలక సంఘముయొక్క ఎన్నికల అక్రమములగు పనులు కలుగకుండ జరుగునని మేము ఆశించి యుంటిమి. ఇట్టి ఎన్నికలు హైదరాబాదునందు జరుగుట ఇదియే మొదటి పర్యాయము కనుక అభ్యర్థులకు మధ్య పోటి తీవ్రముగా నుండుట సహజమే. కొన్ని హాల్కాలలో దురదృష్టము అగు కొన్ని స్థితులు ఏర్పడినవని వినిచింతిల్లుచున్నాము. స్థానిక స్వపరిపాలనా పద్ధతి వృద్ధిపొందవలెనన్నచో ఇట్టివి జరుగక యుండినచాల బాగుగా నుండెడిది. ఒక హాల్కాలో దెబ్బలు కొట్టుకొను వరకువచ్చినదట. ఇద్దరు అభ్యర్థులు తమ అభ్యర్థిత్వమును వదులుకొనవలసినవారైనారు. వారిలో నొకరు మరి విచిత్రపరిస్థితులలో వదలుకొనవలసి వచ్చినది. ఒక హాల్కాలో ఎన్నిక స్థలమున అక్రమములు జరిగినవని వోటరులు పైగొప్పఅధికారులకు విజ్ఞప్తి పంపుకొనవలసివచ్చినది. ఈ అక్రమములు న్యాయస్థానముల యెదుటికి రానున్నవని తెలిసికొంటిమి. కనుక మేము వీని క్రమత్వమును అక్రమత్వమును గురించి ఏమియు విమర్శింపబూనుటలేదు. ఎట్లైనను ఈ విషయమున విచారణ కడుజాగ్రత్తతో జరుపవలసి యుండును. ఏలయనగా క్రొత్తగా ఏర్పడిన పురపాలక సంఘమున ప్రజాపరిపాలనము ప్రవేశ పెట్టబడుచున్న ఈపరిస్థితి సమయమున పురపాలక సంఘముయొక్క కార్యనిర్వహణ సామర్థ్యము బయలుపడు అవకాశము లభింపక పూర్వమే మచ్చ కలుగగూడదు.

౨౨-౧౦-౩౮ (హైదరాబాదు బులెటిను)

——

## "మన శాసనసభ"

——

పురపాలక సంఘముయొక్క సమావేశములకు పత్రికా ప్రతినిధులు వెళ్లుటకు అవకాశము ఇయ్యబడినది. అట్లే శాసనసభలో కూడ పత్రికా ప్రతినిధులకు ఆటంకము లేకుండ పోయి చర్యలు వ్రాసికొనుటకు అవకాశము దొరకవలయును. శాసన సభాచర్యలు జనులు బాగుగా తెలిసికొనుటకు అత్యవసరము. . . కనుక సభాచర్యలు పత్రికాముఖమున తెలుపబడునట్లు తగిన కట్టుదిట్టములు చేయుట అధికారుల కర్తవ్యము.

("సుబహె దక్కన్" పత్రిక ౨౪-౧-౪౮ ఫ)

——

## "౧౩౪౭ ఫ. టప్పా నివేదిక"

——

నివేదిక వత్సరమున, ఆర్థికమాంద్యము వ్యాపించియుండినప్పటికిని మా మహమ్మదు ఆహమదు సాహెబ్ గారి కృషి ఫలితముగా సంవత్సరపు ఖర్చులు అన్నియుపోగా, ౬౩ వేల ౬౧ రూపాయల ౪ అణాలు ౧౧ పైసలు మిగత టప్పా శాఖవారికి కలిగినది. ఇది యెంతయు ప్రశంసనీయము.

"ముషీరెదక్కన్" ౨౪-౧-౪౮ ఫ



## జాబులు

### మేలుకొనుడు

——

మధిర తాలూకాలో కొలదిమంది యువకులు సనాతన వైదిక ధర్మానుష్ఠానమండలి అని పేరిడుకొని కొలదిరోజులు వ్యవహరించిరి. పిదప వైదిక యను పదము తీసివైచి ఇప్పుడు సనాతన ధర్మానుష్ఠానమండలియని పేరిడుకొని వ్యవహరించుచున్నారు. ఇట్టివిషయము యువకులు ఇదివరకే గోలకొండపత్రికలో గమనించియుండవచ్చును.

అదియట్లుండ ఇప్పుడు సదరు మండలివారు జరుగబోవు ఆంధ్రమహాసభలో నొక పండిత మహాశయుని పిలిపించి వర్ణాచారములగురించి చర్చజరుపవలెనని చందాలకు బయలుదేరినారు. ఆట్టి చందాలవసూలు నిమిత్తము నొకవ్యక్తి తూర్పుదిశకు నొకవ్యక్తి పడమటిదిశకును బయలుదేరినటుల వినబడుచున్నది. పైపేరుగల మండలిలేక పోగా ఆపేరుతో డబ్బుకూడా బ్రోగుచేయుచున్నారు గాన జనులాలోచించవలెను. ఖమ్మంమెట్టుకు వచ్చిన వ్యక్తి కొలదిమంది న్యాయవాదులను అనుసరించి వరిద్వారా వైశ్యమహాశయులం గరివల్లను కొంత విత్తము సంపాదించుటకు యత్నించుచున్నట్లు గన్పట్టుచున్నది. వైశ్యులు ప్రపంచమునందు ఎవరేనియున్నారో శూద్ర సమానులని వ్రాయు బ్రాహ్మణులు ఎలట్టి వైశ్యుల నాశ్రయింపబోవుచుండిరో బోధపడకుండా యున్నది. వైశ్యవేదాంత క్రియావిచార వ్యవస్థయను గ్రంథములో 'పూర్వయుగాంతరస్థిత జాతీయానాం వ్రాయశోనష్టత్వాత్' ఏకే చనస్థితాతేప శూద్రాదినిషిద్ధకర్మణాచరణ మాత్రేణా సంకీర్ణాః కింతుదానాం వినవైశత్వేనవ్యవహారః తయాపేక్షయా అల్పతివృత్తియోబబూవు ఇంకొపలువిధములయిన విషయములచే నొక పెద్ద గ్రంథమును సృష్టించియున్నారు. ఆట్టి గ్రంథములో కొన్నియైనను యుచ్చరింపదు మన్న గాథవిస్తారమగును.

విరికిచ్చేసెడు సహాయమునకంటె దుంటమిలతంత్రములవిమితము చేయుబడు ఆంధ్రకొస్కరమును సహాయముచేయుట యుత్తమము. ప్రజలకెంతయు ఉపకారము చేసినవారలమగుదుము. కావున ఖమ్మంమెట్టు మున్నగుగ్రామాలవైశ్యసోదరుత్తములు సూక్ష్మబుద్ధులతో నిజానిజములు గమనించగలరు.

ఇట్లు
ఒక వైశ్యసంఘాభిమాని.

——

### వ్యవసాయ ప్రదర్శనము

——

౨౯ ఆజూరునాడు మహబూబునగరములో జరుగవలసి యుండిన వ్యవసాయప్రదర్శనము, అచ్చట ప్లేగువ్యాధి ఆరంభమైనందున తాలూకదారుగారి సూచనప్రకారము ఆపివేయబడినది.

——

### మల్కాజిగిరిలో ప్లేగు

౨౨ ఆజూరునాడు ఇక్కడ ఒకనికి వ్యాధితగిలినది.

——

### గోలకొండ కవులు, బిరుదులు

——

మ రా రా గోలకొండ పత్రికాధిపతిగారికి —

ఆర్యా,

కవులసంచికకు చేరి జీవించిన యాధునికకవులు బిరుదములున్నవని వ్రాసుకున్న, యేసంవత్సరములో యెచ్చోట యేసమయములో దొరికినవో వారలవల్ల వాటినకళ్లను తెప్పించుకొనిచూచి బిరుదములను ప్రకటించడము యుక్తమని గోలకొండ కవులసంచికా ప్రచారకర్తలకు విన్నవించనైనది. అట్లు కాకున్న నిజముగ బిరుదములు సంపాదించిన యున్న తమంతకు దామే వ్రాసుకున్నవారున్న సమానులగుదురు. ఇది అనగా సంచిక చిరకాలము నుండునదిగాన తత్త్వవిమర్శలేకున్న యింత రమణీయముగా నుండదని నాయాశయము. గావున యెవరు బిరుదములున్నవని వ్రాసిరో వారి సర్టిఫికేటు నకలు తమకుచేరి తాము చూచువరకు వారివారి బిరుదములు నేమి చేయవలయునో అట్లు చేసెదిగా కోరినాడ, వారినారి కవనము వారివారి పేర్ల ప్రకటించుటలో అభ్యంతరములేదు.

బిరుదముల విషయముమాత్రము చర్చతో ప్రకటించుట యుక్తమని తోచినది. దీనియాదమియిష్టము

భావ సం॥ అశ్వయుజశు॥౧౫ }

ఇట్లు
దీక్షితుల విశ్వనాథశాస్త్రి
ఆమరచింతాత్మకూరు ధర్మాధికారి

——

## జిల్లాల వార్తలు

### తృతీయాంధ్రసభ, ఖమ్మము

——

(విరాళముల వివరము)

| | | రు |
|---|---|---|
| | ఇదివరకు ప్రకటింపబడినవి | ౧౦౭౫ |
| | వనం కృష్ణాపురము (మరల) రు. ౩౭ | |
| మ రా | వనంబుచ్చితరావుగారు ధాన్యము ౬ కుండలు | ౬ |
| ,, | బతులగురవయ్యగారు | ౫ |
| ,, | వేంకటరామయ్యగారు | ౩ |
| ,, | రామయ్యగారు | ౨ |
| ,, | బయ్యం క్రిష్టయ్యగారు ధాన్యము ౩ కుం. | ౩ |
| శ్రీమతి | వీరమ్మగారు ధా ౪ కుం | ౩ |
| ,, | తల్లూరు శాంతమ్మగారు కుం | ౪ |
| మ రా | చాగంటి అచ్చయ్యగారు ౧ కుం | ౧ |
| ,, | ,, చిన అచ్చయ్యగారు | ౧ |
| ,, | చెన్ను వేంకయ్యగారు | ౧ |
| ,, | పరసూరి చినకోటయ్యగారు | ౨ |
| ,, | వనం శేషగిరిరావుగారు | ౧ |
| ,, | కొలిపాక ముత్తయ్యగారు | ౧ |
| ,, | పరసూరి పెదకోటయ్యగారు | ౩ |
| ,, | పోలూరు రామస్వామిగారు | ౨ |
| | చిరుమర్రు రు. ౫౧ | |
| ,, | మాటేటి వేంకటరామారావుగారు | ౧౦ |
| ,, | సామినేని కంథయ్యగారు | ౩ |
| ,, | చింతనిప్పబోధయ్యగారు | ౩ |
| ,, | బతులలక్ష్మయ్యగారు | ౩ |
| ,, | బండి వేంకయ్యగారు | ౨ |
| ,, | సీతయ్యగారు | ౨ |
| ,, | అప్పయ్యగారు | ౧ |
| ,, | చినచలమయ్యగారు | ౨ |
| ,, | అనుమోలు నాగభూషణంగారు | ౧ |
| ,, | వప్పిచ్చయ్యగారు | ౧ |
| శ్రీమతి | మానెపల్లి శంకరమ్మగారు | ౨ |
| మ రా | వేముల వేంకటప్పయ్యగారు | ౧ |
| ,, | ,, చినకోటయ్యగారు | ౧ |
| ,, | నెల్లూరి వెంకయ్యగా | ౩ |
| ,, | పల్లపాటి పుల్లయ్యగారు యాదవ | ౫ |
| ,, | గాలి అబ్బయ్యగారు | ౧ |
| ,, | సామినేని మంగయ్యగారు | ౩ |
| ,, | నరసయ్య, సుబ్బయ్య గార్లు | ౩ |
| ,, | చినపరిపయ్యగారు | ౧ |
| ,, | యునపవీరయ్య, మైసయ్యగార్లు | ౨ |
| ,, | తురక సోమప్ప మంగులు నరసింహము గార్లు | ౧ |
| | మొత్తము రు | ౧౧౨౪ |

ఈప్రకారము మిక్కిలి యుదారముతో వాగ్దానమొనర్చిన దాతలవిరాళములను వందనములతో సంగ్రహించుచున్నాము. ఈవిరాళములు బతులబసవయ్యగారి ప్రోత్సాహపూర్వకములైన మాటలవలన వారికిని యీసంచారమునందు తమతోడ్పడమును యిచ్చినట్టి వంటుపు నరసింగరావుగారికి సహాయంటగొని నాతోవచ్చిటన ఎల్లరమయందు పాలుగొనుచున్న ఊటుకూరు వేంకటేశ్వరరావుగారికిని కృతజ్ఞతావందనములు.

ఇట్లు విన్నవించువిధేయుడు
ఆయితరాజు, తీడికటి రామరావు
ఆ సం అధ్యక్షుడు

——

### వీరట్లోలు ఉత్సవము

——

మహబూబునగరములో మున్సిఫుగానుండిన మౌ. హమీదుద్దీను గారు బదిలీ అయిపోయిన సందర్భమున వకీళ్లపక్షమునవారికివిందు చేయబడును. ఆసందర్భమున శ్రీయుత నారాయణరావుగారు మౌ మస్తానీగారు వకీళ్లు ఉపన్యసించి మున్సిఫుగారిని ప్రశంసించిరి.

——

### అవురంగాబాదు కాలేజిదినము

——

౩౦ ఆజూరు మంగళవారము వరపు యుత్సవము అవురంగాబాదు కాలేజి వారు జస్టిసు మేక్సి నవాబ్ హైదర్ నవాజ్ జంగ్ గారు అధ్యక్షత వహింపగలరు.

——

## సంస్థాన వార్తలు

### "జార్జి"గారికి గ్వాలియరు సింహాసనము

"జార్జి"గ్వాలియరు సంస్థానమునకు రాజుగా కొద్దిరోజులలో అభిషిక్తులు కాగలరు. కొద్దిరోజులలో వారికి మైనారిటీ ౧౮ యేండ్లవయస్సు పరిపూర్తియగును. వీరు గ్వాలియరు మహారాజుగారి కుమారులు. వీరు ప్రపంచమందలి ధనికులలో రెండవస్థానమునకు అర్హులు. వారినగలే ఇంగ్లీషునాణ్యెములలో ౪౦౦౦౦౦౦ పౌనుల విలువ చేయును,

ఈసంస్థానమునుయిదివరకు పాలించియుండిన మహారాజాగారు ౧నగా "జార్జి"గారితండ్రి గత యిరోపామహాసంగ్రామములో బ్రిటిషువారి సేనలో పనిచేసియుండిరి. ఆయుద్ధసమయములో తనకు పుట్టిన శిశువునే కీ. శే. మహారాజాగారు జార్జియని పేరుపెట్టినారు. నేను బ్రిటిషు సామ్రాజ్యమునకు సార్వభౌముడగు జార్జిచక్రవర్తిగారియెడ వారికిగల విశ్వాసముచే వారట్లు చేసిరని లండనులో సండే యెక్స్‌ప్రెసు పత్రికలో ప్రకటింపబడినవి. అదేవిశ్వాసమువల్ల గతమహారాజు మరియొకబిడ్డకు మేరీయని పేరిపెట్టిరి.

అంతేగాక బ్రిటిషువారుతప్ప తనబిడ్డలకు విద్యనేర్పుటకు మరియెవరుగాని పనికిరారని బ్రిటిషువారికే ఒప్పించిరి.

గ్వాలియరు సంస్థానము మొదటితరగతిది దీనికి ౨౧తోపుల గౌరవమున్నది. ఈసంస్థానమునకు మరణదండన విధించు అధికారము కూడ గలదు.

ఈసంస్థానము అనేక గొప్ప పరిశ్రమలతో కళకళలాడుచుండును. వీటిని పూర్వదారులు చక్కగా అభివృద్ధినొందించుటచేతనే అదియిపుడు అంత ధనవంతమైనది.

---

# కొన్ని సంస్థానముల నిప్పుపెట్టెల నిషేధము

మఘువ నిజాంప్రభుత్వవార్తాలయమునుండి యిట్లుతె లుపబడుచున్నది,—

ఇదివరకు ౧౯౪౦ ౧౩౪౪ ఫసలీవాడు జారీచేయబడిన నోటిఫికేషన్ ద్వారా కొన్ని సంస్థానములనుండి మఘువ నిజాంరాష్ట్రములోనికి అగ్గిపెట్టెలదిగుమతి నిషేధింపబడినట్లు తెలుపబడియుండెనుగదా ఖపుడుఅట్టి సంస్థానముల గొండాలు, పాలాముర్రు సంస్థానములపేరు తొలగింపబడవలెను ఈరెండుసంస్థానములనుండి రాష్ట్రములోనికిదిగుమతిచేయబడు బ్రాండ్లోని అగ్గిపెట్టెలు నిబంధనల ప్రకారము చూడబడును

## గుఱ్ఱము మోటారుకిందపడుట

షంషేర్జంగుగారి మోటరు సికింద్రాబాదు పోవుచుండగా మహబూబ్నగర్ వాడిలో ఒకగుఱ్ఱమువచ్చి అకస్మాత్తుగాకను గుఱ్ఱము తెంటనే మోటారుక్రిందపడి చచ్చెను.

# అజ్మీరు స్పెషలురైలు

ఎట్లో కష్టములుపడి తుదకు ప్రయాణికులు మరల రైలులో హైదరాబాదుచేరిరి వీరికికలిగిన నష్టమును తానిచ్చెదననికంట్రాక్టరు ఒప్పుకొనెనట!

## శరణప్ప అభియోగము

పీదరులో మిర్జా ఫరమతుల్లా బేగుగారి న్యాయస్థానమున ౧౫,౧౬,౧౭,౧౯ ౨౦,౨౨ అజూరులలో విచారణ జరిగినది, పోలీసుపక్షమున అస్కారీహుసేన్ బారిస్టరు గారును, నిందితులపక్షమున బొంబాయిబారిస్టరు అజాదు హనుమంతరావువకీలుగారు పనిచేసిరి మొత్తము ౫౯ వందిసాక్షులలో ౪౨ వాఙ్మూలములు వ్రాసుకొని జరహాచేయబడినది తక్కినవారి వాఙ్మూలములు ౨౩ నుండి జరుగనున్నవి

ఒకసాక్షి వాఙ్మూలమును గురించి హైకోర్టులో నిగరానిజరిగినది ౨౪ అజారువాడు హైకోర్టులో వాదము జరిగినది

## హెడ్జాజుయాత్రికులకు హెచ్చరిక

ప్రభుత్వవార్తాలయమునుండి యిట్లుప్రకటింప బడుచున్నది,—

ఈక్రిందిస్టీమరులు బొంబాయినుండి క్రిందచెప్పబడినతేదులలో బయలుదేరునను మెసర్సులుర్నుమహరిసన్ రెండు కోవారు తెల్పినారు

౧. „అల్వీ” కరాచిగుండా జెడ్డాకు౧౯౩౪ నవంబరు౧౬ నాడు
౨ „ జహాగీర్” „ „ ౨౯ „
౩ „ఇస్లామి” „ ౧౯౩౪ డిసంబరు ౧౭ ,

కడపటిస్టీమరు ౧౯౩౫ జనవరి ౨౪ వ తేదినేను గాకె డామప్రయాణమగును, ఇతరస్టీమర్లు ఫిబ్రవరి ఆకరువరకుఅప్పుడప్పుడు పోవుచు నేయుండును.

# సప్తాహ మహోత్సవము

[విలేఖరి]

ఖానాపురము, ౧౫-౧-౧౩౪౪

ఖానాపురము యీనిజాంరాష్ట్రమందలి పాయిగాయిలాకాలోచేరినయెల్లడప తాలూకాలోనిది ఇక్కడ ౨౯ అజారు ౧౩౪౪ మొదలుకొని౫ ది ౧౩౪౪ వరకు కీర్తిశేషులగు డాక్టరుటి రాజగోపాలవర్మగారిజ్ఞాపకార్థమై మహావైభవముతో సప్తాహమహోత్సవముజరుగనున్నది దీనికార్యభారమును, కీ॥శే॥ డాక్టరుగారిసోదరులగు టి ధనుష్కోటివర్మగారువహించియున్నారు యీమహోత్సవము కీర్తిశేషులజ్ఞాపకార్థము ఖానాపురమందుకట్టబడిన శ్రీగోపాలధన్వంతరిమందిరమునందు మహావైభవముతోజరుగును

# హైద్రాబాదు స్త్రీలమహాసభ

౨ నవంబరు శుక్రవారము నాడుజరుగుయీసభరెడ్డి హాస్టెలుభవనములోఆగునని ప్రకటింపబడెను కాని అస్థలము మార్చి బషీరుబాగులో జరుపుటకునిశ్చయింపబడినది,

—:—

# సహకారదినము

౨౯ అజారునాడు ఈయుత్సవము నవాబ్ రయాస్జంగు బహదరుగారి అధ్యక్షతతో జరుపబడును. ఆనాడు సగముదినము సెలవులుయియ్యబడును. జిల్లాలలోకూడ ఇట్లే సెలవిచ్చుచున్నారని తెలియుచున్నది.

## హైద్రాబాదు ఆర్థికసంఘము

మనరాష్ట్రములోని ఆర్థికపరిస్థితులను విచారించుటకై ౨౩ అక్టోబరువాడు కోఆపరేటివ్ యూనియనువారు యొక్క సభ సమావేశపరచిరి ఈసంఘము స్థాపింపబడినది దీని కార్యనిర్వాహకవర్గము క్రిందివారు కలరు

౧. నవాబు సర్ హైదరునవాజుజంగు అధ్యక్షుడు
౨. మిస్టరు సయ్యదుమహమ్మదు అజంసా॥ ఉపాధ్యక్షుడు
౩ యస్ యం. నవాబ్ కార్యదర్శి
౪. సయ్యదు అక్బరుసా॥
౫ ప్రొ హబీబుర్రహిమాన్సా॥ } సభ్యులు
౬ ఎం ఏ నవాబుసా॥ }
౭ అహమదు మొయినుద్దీన్సా॥ }
౮ ఎ ఎము ఖుర్షీదుసా॥ }

—

## మొఈనుద్దౌలా క్రికెటు పోటీ

దీని తారీఖులను మార్చుటకు కొందరుయత్నించి ఉత్తరప్రత్యుత్తరముల జరిపిరి కాని అట్టిమార్పులు జరుగలేదు ఎప్పటితారీకులేనిలిచియున్నవి

---

స్వీకరణమైన పెట్టెకెమిరా రూ ౨-౧-౨-౦ లకుమాత్రమే.



ఇప్పుడు అమ్మబడుచుండు కెమిరాలన్నిటిని పోటీచేయుగల క్రొత్త కెమిరా, ఫోటోగ్రాఫు విద్యనుత్యరలో నేర్వగోరువారికి మంచిసమయము. ఒకడజనుప్రింటింగు పేపర్లు, ౪ ఫిలిముయక్స్పోజర్లు, దిట్టమైన లెన్సు డెవలప్ చేయు రసాయన వస్తువులు మొదలగు సంపూర్ణ పరికరములతో సహా ఖరీదు వెల రూ ౨-౧-౨-౦ లు టపా, ప్యాకింగుచార్జీలులేవు. ఒక్కసారి ౩ టిని తెప్పించుకొనువారికి టపాఛార్జిలేదు. మీపత్రికలుగని కోరవలెను భారత్ యూనియన్ ట్రేడింగ్ అండుకో, పోష్టుబాక్సు ౧౦ ౨౩౯౪, కలకత్తా

---

గోలకొండ పత్రిక

శ్రీభావనామ సం॥ అశ్వయుజ బ॥ ౧౦

గురువారము

## ప్రశంసనీయమైన ఆచారము

మనపురపాలకసంఘములో క్రొత్త చట్టము ప్రకారము నిమ్నజాతుల ప్రతినిధికిగానుఒకస్థానము ప్రత్యేకించబడినది. ఈస్థానముఎన్నికలచేగాక, ప్రభుత్వమువారు నియోజించుటచే భర్తీ చేయబడవలసిన స్థానములలో నొకటి. ఆ స్థానమునకు యిపుడు శ్రీయుత అరిగె రామస్వామిగారిని ప్రభుత్వమువారు నియోజించుట సంతోషకరమైన విషయము. ఏలలన, శ్రీయుత రామస్వామిగారి ప్రాతినిధ్యము కేవలము ప్రభుత్వనియోగమేగాదు, అదివాస్తవముగా నిమ్నజాతుల వారిచే యెన్నికయే యని చెప్పవలసియున్నది. ఈ నియోగమునకు ముందు ప్రభుత్వమువారు ఈ నగరమునందలి నిమ్నజాతివారిలో ఎక్కువమంది ఆమోదించు ముగ్గురిపేర్లను సూచించ వలసినదిగ కోరియుండిరి. ఆదేప్రకారము నిమ్నజాతికి చెందిన పౌరులు తమకు ఎవరెవరియందు విశ్వాసముగలదో అట్టిముగ్గురిపేర్లను తెలియచేసిరి. ఆ ముగ్గురిలోను శ్రీయుత రామస్వామిగారికి తక్కిన యిద్దరికంటె ఎన్నియోఎక్కువ ఓట్లువచ్చెను. ఇప్పుడు ఈయెక్కువ వోట్లువచ్చిన శ్రీయుత రామస్వామిగారే ప్రభుత్వమువారిచేగూడ నంగీకరింపబడినారు.

ప్రభుత్వ నియోగము అనినప్పుడు, ప్రభుత్వమువారు తమకుతోచిన ఎవరినేని నిమ్న జాతులకు ప్రతినిధిగ నియోగించుటకు అధికారముగలదు. నిమ్నజాతులవారిచే యెన్నుకొనబడినవారినే, అందులోను అత్యధిక సంఖ్యాకుల వోట్లుపొందినవారినే నియోజించవలెనను నిర్బంధము ప్రభుత్వమునకు లేదు. అట్లయ్యును, వారు అత్యధికసంఖ్యాకులవిశ్వాసమునకు పాత్రుడైనవానినే నియోజించుట ప్రభుత్వమువారి ఔదార్యగుణమునకు లక్షణమేగాని వేరుగాదు. స్పష్టముగద్భుతముచేయుటకుఅధికసంఖ్యాక ప్రజల అభిప్రాయమును దయాలయులగు మన ప్రభుత్వము వారుతిరస్కరించువారు కారు అనుటకు యిదియొక నిదర్శనము. మనబాడఁటీయ శాఖామంత్రివర్యులు ఈ చెప్పబడిన ఏర్పాటుచే దివ్యమైన ఆచారమును స్థాపించినారు మందుగూడ ఇది భగ్నము కాకుండ సంరక్షింపబడగలదని మేము ఆశించుచున్నాము.

## వెట్టి చాకిరి

షాహాబాదు చాకలివాండ్రు సర్కారీ ఉద్యోగస్థులగు తహాసీల్దారు, పేష్కారు, మున్షీలు మొదలగువారలు తమనుండి నిర్బంధముగా వెట్టి చాకిరి తీసుకొనుచున్న విషయములో సర్ఫేఖాస్ స్పెషలుఆఫీసరగు రాజాబహాదర్ వెంకటరామారెడ్డి, ఒ. బి. ఇ. గారివద్ద మొఱపెట్టుకొని యుండిరిగదా! రాజాబహాదరుగారు విచారణ జరుపుటకై తాలూకాదారికి వ్రాయగా తాలూకాదారు తహసీల్దారుకే వ్రాసిరట. చాకలివాండ్రు మొదట భయపడినట్లే, దానివల్లపరిస్థితులుమారవాయెను. అంతట చాకలివాండ్రు తిరిగి తాలూకాదారిగారివద్ద మొఱపెట్టుకొనగా యిప్పుడు విచారణ సల్పుటకు గాను మదద్గారుమాలుకు ఆజ్ఞ ఈయబడినది. ఈ ప్రకారముగా యింక యెందరు వెట్టిబాధను సహించుచున్నారో. సాధారణముగా వీరందరు దరిద్రులును, విద్యావిహీనులునగుటచే వెంటనే కేంద్రాధికారులవద్దకు పోయి మొఱపెట్టుకొన శక్తిలేనివారు. కాబట్టి ఉన్నతాధికారులకు మొఱలురానంతమాత్రమున ఎక్కడను వెట్టిలేదని తలచరాదు. ఎంతోవిపరీతమైన బాధమైనప్పుడు గాని యీదరిద్రులు కదలలేరు. కాబట్టి అధికారులు తమప్రభువరేణ్యునికి ప్రియులైన వీరిబాధలను నివారించువిషయమున తామే ముందంజ వేయవలెను. క్రిందిఅధికారులు ప్రభువరేణ్యుని ఆజ్ఞలను సరిగా నెరవేర్చుచున్నారోలేదో చురుకుగా విచారించుచుండవలెను. ఇట్లు ఉన్నతాధికారుల నిగరానియున్ననేగాని చిరకాలాగతమైన వెట్టిదురాచారమును మాన్పసాధ్యముకాదు.

## కాంగ్రెసు అధ్యక్షునివద్దకు సంస్థానముల రాయభారము

బొంబాయి, అక్టోబరు ౨౬ —

వివిధభారత సంస్థానముల కాంగ్రెసు ప్రతినిధులు ౧౪ గురు శ్రీ నాసురను గారినాయకత్వమునకేను కాంగ్రెసుఅధ్యక్షులగు బాబురాజేంద్రప్రసాదు గారివద్దకు రాయబారముగావచ్చి యిటీవలకొందరు కాంగ్రెసు నాయకులుబాధ్యతగలవారు ప్రకటించిన ప్రకటనలుతమకు కష్టములు కలిగించుచున్నవనియు కాంగ్రెసుదేశీయసంస్థాన ప్రజలసహాయమునకు రాలజాలుటలేదనియు, దేశీయసంస్థానములందు కాంగ్రెసుసంఘములను స్థాపించుటగూడ తలపెట్టలేదనియు యీ ప్రకటనలవలన అర్థమగుచున్నదనియు, తమవాంఛకు సంస్థానప్రభుత్వమువారు కాంగ్రెసుసంఘసభ్యులను చేర్పించుటగూడ నిరాకరించివిడదియువారు అధ్యక్షునకువిన్నవించిరి

అధ్యక్షులువారివిన్నపమును శాంతముగ నాలకించి కాంగ్రెసు నిబంధనలచెప్పుటకు సంస్థానములలో కాంగ్రెసుసంఘము ఉండరాదని విధింపబడలేదనియు గాంధిగారితో నాలోచించి తగినసహాయము చేయుదుమని చెప్పిరి

## సంస్థాన సమస్యపై కాంగ్రెసువైఖరి

బొంబాయి అక్టోబరు ౨౭

సంస్థానప్రజల సమస్యవిషయమున గాంధియున్నగు కాంగ్రెసు సభ్యులతో కూడి కొసంఘమునుగ నియమించిరి సంస్థానములవిషయమై కలకత్తా కాంగ్రెసు మహాసభలో సమాలోచింపబడు తీర్మానము ఆచరణయోగ్యముండునని మహాత్ముడు స్పష్టపరచెను మహాత్ముడు తయారుచేసిన చిత్తుతీర్మానము ఈక్రిందివిధముగ నున్నది —

సంస్థాన వ్యవహారముల విషయమై కాంగ్రెసు వైఖరిని స్పష్టపరచవలెనని పలువురు కోరినందున ఈక్రిందిరీతిగా నిశ్చయించనైనది

సంస్థానములలోని పరిపాలనా విధానమున కాంగ్రెసు జోక్యమును కలిగించుకొనదు. భారతదేశమంతయు చిన్న చిన్నభాగములుగా విభజింపబడి, పలువురి పరిపాలనక్రింద యున్నను దేశమంతయు ఒక్కటేయని కాంగ్రెసు భావించుచుండును సంస్థానాధిపతులు తదితరప్రాంతములలోని భారతీయులను విదేశీయులుగా పరిగణించుట కాంగ్రెసునకు విచారకరము. సంస్థానాధిపతులు తమ సంస్థానములలోని ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగవలెనని కాంగ్రెసు ఇదివరకుజరిగిన మహాసభలో విన్నవించినరీతిగా యీసభలోగూడ విన్నవించుచున్నారు ''

సంస్థానప్రజలు తమ స్వాతంత్ర్యమునకై చేయుచున్న కృషికి ప్రోత్సాహమొసంగి వీరిపరిశ్రమలను కాంగ్రెసుమహాసభ కొనియాడుచున్నది

ప్రతినిధులను కాంగ్రెసువారు ఆమోదింపవలెనని, సమస్త ప్రతినిధులతో, సంప్రదించి, ఆ సంఘమువారు తయారుచేసిన రిపోర్టును అఖిలభారత కాంగ్రెసుసంఘసభలో విమర్శించెదరనియు మహాత్ముడు తెలిపెను.

## గాంధిమహాత్ముని పరసాలు

గాంధిమహాత్ముడు అక్టోబరు ౨౯వ తేదినాడు బొంబాయి వదలివార్ధాపురమునకు చనుటకు బయలుదేరిరి బాబురాజేంద్రప్రసాదుగారు మహాత్ముని పాదములంటిరి మహాత్ముడు ఆశీర్వదించెను ఆరోజు మహాత్ముడు మహాసంతోషముతో నుండెను ఒకబాలునితలపైనుండు టోపీనియాయన తీసి వల్లభాయిగారిపటేలతలపైపెట్టిరి అందరు నవ్విరి అందరును గాంధీగారికి ప్రణమిల్లి యందరికు ప్రాశంసలమధ్య మహాత్ముడు అబ్దుల్ గఫూరునగరమునకు, అందుతోటి కాంగ్రెసును విడెను

## క్రొత్తకాంగ్రెసు వర్కింగు కమిటీ

కాంగ్రెసుయొక్క క్రొత్తవిధానముప్రకారము రాజేంద్రబాబుగారు క్రిందివారినివర్కింగుకమిటీసభ్యులనుగ ఎన్నుకొనిరి

అధ్యక్షుడు బాబురాజేంద్రప్రసాదుగారు, జనరల్ సెక్రటరీలు పండితజవహరలాలునెహ్రూ, డాక్టర్ సయ్యద్ మహమూద్, ఆచార్యకృపాలినిగారు కోశాధిపతి సేట్ జమ్నాలాల్ బజాజ్ గారు, సర్దార్ వల్లభాయిపటేల్ ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్, శ్రీమతిసరోజినినాయుడు, సర్దారుసర్దుల్ సింగు, డాక్టర్ అన్సారీ మౌలానా అబ్దుల్ కలాం ఆజద్, రాజగోపాలాచారి, గంగాధరరావుదేశ్‌పాండే, డాక్టర్ పట్టాభిసీతారామయ్య, జయరాం దాసుదౌలత్ రాం — వీరలుసభ్యులు పండితజవహర్లాలు నెహ్రూగారులేనప్పుడు కె యస్ నారిమన్ గారు వారిబదులు పనిచేసెదరు రాజేంద్రబాబుగారుఅలిండియాకాంగ్రెసు కమిటీని పొట్నాకుమార్చుటకు నిశ్చయించిరి

### కాంగ్రెసునగరులో కార్మికుల ఘోష

అక్టోబరు ౨౭వతేదినాడు కాంగ్రెసునగరులో ఉదయము గం॥ ౧౧ కు అఖిలభారతట్రేడుయూనియనుకాంగ్రెసు పక్షమున కార్మికులుకాంగ్రెసుఅధ్యక్షుని సముఖమునకు ఎఱ్ఱజెండాలతోను వారిఘోషలతోను ప్రవేశించిరి వారినాయకులు ఉపన్యాసములనిచ్చిరి రాజేంద్రప్రసాదుగారు ఆహ్వానింపబడి అటకువచ్చియుండిరి

అక్టోబరు ౨౮

అజ్మీరులో కాంగ్రెసువారి ఎన్నికలనుగూర్చినతగవుసందర్భమును యీరోజామరలవాలంటీర్లు గాంధిగారి బసయెదుట సత్యాగ్రహము చేసిరి గాంధిగారువారివాదమును నెమ్మదిగావినిపరిష్కరించుటకు ఒకకమిటీ నేర్పరుతునని సూచించగా వారు సత్యాగ్రహముమానిరి తర్వాత వర్కింగుకమిటీవారు ఒకవిచారణకమిటీ నేర్పరచిరి

### రాజేంద్రబాబుగారిక ఉబ్బసము

రాజేంద్రబాబుగారికి అక్టోబరు ౨౭వ తేది ఉబ్బసముజ్వరమురాగా ౨౮వ తేది డాక్టరుపరీక్షించి రెండురోజులుసంపూర్ణవిశ్రాంతియవసరమనిరి అందువల్లనారుముందనుకొనినప్రకారముగా కాంగ్రెసుఎన్నికల ప్రచారమున కైఢిల్లీ మొదలగుచోట్లకుపోవుటమానివలసివచ్చినది తేదిపొట్నాకుపోయిరి

కాంగ్రెసుఆహ్వానసంఘమువారు అప్పుడే కాంగ్రెసు నగరమును పడగొట్టుట ప్రారంభించిరి. ౧౨౦ అడుగుల యెత్తుగలజాతీయపతాకమును బొంబాయికాంగ్రెసుమహాసభ జాపకార్థమై శాశ్వతముగ నుండుటకై ప్రదర్శ సంఘమువారి అనుమతినికోరిరి అదిమోదకున్నదోలేదో మూడవలెను

# మహాత్ముడు అంగీకరించినసూచనలే గెల్చుట

## ప్రతికూలమైనవి ఓడుట

### కాంగ్రెసు మహాసభ సమాప్తి

అక్టోబరు ౨౭

భారతదేశీయ మహాసభలో నిన్న రాత్రి పండితమాలవ్యా గారి సవరణ (సాంఘిక పరిష్కారమును నిరాకరింపరాదను నది) ౮ గంటలసేపు చర్చజరిగినపిమ్మట అత్యధికసంఖ్య ఓట్ల చేఓడిపోయినది. అన్ని సవరణలు ఓడిపోయినపిమ్మట పార్లమెంటరీబోర్డు, నిర్మాణ కార్యక్రమము, సాంఘికపరిష్కారము మున్నగు వాటినిగూర్చి డా॥ అన్సారిగారు ప్రతిపాదించిన మొదటి తీర్మానము అత్యధికసంఖ్య వోట్లచేనామోదించ బడెను.

#### సోషలిస్టుల సవరణ

నరేంద్రదేవుగారి సోషలిస్టుసవరణ ముఖ్యమయినది గుటచేతను అందు మాలవ్యా సవరణాంశము గూడ యిమిడి యుండినందునను, ముందుగ అదిఓటునకు పెట్టబడెను. అధిక సంఖ్య వోట్లతో వోడిపోయెను. మార్ధవులు చెలరేగెను కొందరు ఓట్లులెక్కింపగోరగా ప్రతికూలురసంఖ్య అధికమని స్పష్టముగ తెలియుచుండగ లెక్కింప నవసరములేదని అధ్యక్షుడనెను సామ్యవాదుల కార్యక్రమమును సూచించు సవరణ గూడ నిస్సందేహముగ వోడిపోయెను

అంతట నరేంద్రదేవుగారు పార్లమెంటరీ బోర్డువిధానమును తీసివేయవలెననిరి లాహోరు కాంగ్రెసుసభలో సంపూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసు పరమావధిగా నిర్వచింపబడినదనియు, అసంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించుటకు శాసనసభాబహిష్కారమే ప్రథమసోపానమనియు నిర్ధారణచేయబడియుండెను కాబట్టి అధోరణీనియిపుడు మార్చుటకు వీలులేదు శాసనసభలకువెళ్లి పనిచేయుట కేవల వ్యర్థకాలక్షేపము ”

ఈసవరణ తీర్మానము ను శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు బలపరచుచు నిట్లుదెలిపిరి ఈ పార్లమెంటరీబోర్డువ్యవహారమువల్ల జనసామాన్యమున కేదియునలాభముండదనే తప్పసాంఘిక సమత్వవాదులు దీనినామోదింపజాలరు గవర్నమెంటువారు మనలను సవాలు చేయుచున్నారని వాదించుటకేవలహాస్యాస్పదము సర్కారువారు సవాలు నేడు కొత్తగవచ్చినకాదు ఈస్టుఇండియా కంపెనీవారీ దేశమున కాలిడినప్పటినుండి యున్నది దేశములోని హెచ్చుతరగతుల వారికి నితక్కువ తరగతులవారికిని సంఘర్షణకూడనని కాంగ్రెసు వాదించుట కడుచిత్రముగనున్నది కొలదిమంది ధనాఢ్యులును విద్యాధికులును మాత్రమే ప్రభుత్వాధికారమును తమ చేతిలోనుంచుకొని ఆస్తిపరులను తమవశమొనర్చుకొనుటయు ఈపరిస్థితి యున్నంతకాలమున నుండవలసినదే

మౌల్వీ అబ్దుల్ సలాంగారు , మహమ్మదీయులకు అందరికిని మొత్తమ్మీద ప్రాతినిధ్య ప్రణాళిక అంగీకృతమని తీర్మానములో చేర్కొనబడియున్నది ఇది సత్యసమన్విత మగారు షియాలును జాతీయపక్ష మహమ్మదీయులును యీ ప్రాతినిధ్య ప్రణాళికను ఖండించియేయుండిరి కాబట్టిమహమ్మదీయులందరకిని యీ ప్రణాళిక అంగీకరమని చెప్పటసరికాదు మాలవ్యాగారి అభిప్రాయముతోనే నేకీభవించుచున్నాను కాంగ్రెసుసభవారు ప్రాతినిధ్య ప్రణాళికను నిరాకరింపవలెను అట్లుగాక నోటిమాట పిల్లిమాటముగ నున్న యెడల ప్రాతినిధ్య ప్రణాళికను చిట్టచివరకు అంగీకరించుటయే సంభవించును అని చెప్పిరి.”

కథపాలిగారు మాట్లాడుచు సాంఘిక సమత్వవాదుల ఆక్షేపణలకు ప్రత్యుత్తరమొసంగిరి

గోపాలసింగు స్వామిగారు మాలవ్యాగారి సవరణ తీర్మానమును సమర్థించుచు మాట్లాడిరి

సర్దారు వల్లభాయిపటేలుగారు లేచి నిలువబడగనే మార్ధవములు మిన్నుముట్టెను అన్సారిగారు ప్రతిపాదించి ప్రధాన తీర్మానమును బలపరచుటకై ఆయనలేచెను , దేశమంతయు శాసనసభా ప్రవేశమునకు సుముఖమైయున్నది ఇపుడావిషయమును తిరిగి తర్జనభర్జనచేయుట, కేవలము కాలాతీతవిషయము ౧౨౫ మంది కాంగ్రెసు అభ్యర్థులు యీవరకే యెదురాడువారు లేక ఎన్నుకొనబడియున్నారు. ఇక శాసనసభాప్రవేశవిషయములో మన నిర్ణయమును మార్చుకొని వెనుకంజవేయుట్లయిన వలనుపడదు, ప్రత్యేకప్రాతినిధ్య ప్రణాళిక అప్రమాణిక మైనట్టిదని చెప్పజాలనట్లే... నా కిందరకు మాలవ్యాగారియందు గౌరవముతో నున్నా రు కాని ఆయన వ్యవహారధోరణిని అంగీకరించలేను, ఈ ప్రత్యేక ప్రాతినిధ్యప్రణాళికను సవరించుట యెట్లనున్నను మనకుగల పెద్దసమస్య వివిధ సంఘములవారిని సమాధానమునకు తీసికొనివచ్చి సమ్మేళనము చేయుటవల్లనే అది కొనసాగును కనుక మాలవ్యాగారును కాంగ్రెసుజాతీయ పక్షమువారును అవలంభించెడి పద్ధతివలన యీప్రత్యేక ప్రాతినిధ్యము శాశ్వతముగ సుస్థిరమైయుండగలదు మాలవ్యాగారు వేరొకపార్టీని యేర్పాటుచేయుట గొప్పపొరబాటు ఇట్టి పద్ధతివల్ల కాంగ్రెసుసభ హానిపొందగలదు ఇప్పుడైనను మించిపోయినదిలేదు ఇప్పుడైనను మాలవ్యాగారు వెనుకకు మరలి మనతోచేతులు కలిపిపనిచేయవచ్చును సాంఘిక సమత్వవాదులు పార్లమెంటరీబోర్డుపద్ధతి బాగుగలేదని ఆక్షేపించుట పెద్దపొరబాటు అనుభవజ్ఞానముకలవారు చెప్పవలసిన మాటగాదది ” అని వల్లభాయిగారుచెప్పిరి

మాలవ్యాగారి ఆక్షేపణలకు ప్రత్యుత్తర మొసంగుచు డా॥ అన్సారిగారు యిట్లు చెప్పిరి —

“జాతీయపక్ష మహమ్మదీయులు ప్రత్యేకప్రాతినిధ్య ప్రణాళికను అంగీకరించుచున్నారనుట సర్వాబద్ధము సర్వపక్షసమన్వయమువల్ల సమాంగీకారయోగ్యమైన ప్రణాళికను తయారుచేయుటవల్లనే యీప్రత్యేక ప్రాతినిధ్య ప్రణాళికను త్రోసివేయగలమని నాటికిని నేటికినిగూడజాతీయపక్ష మహమ్మదీయులు వాదించుచున్నారు అందులకై చేయవలసిన విశ్వప్రయత్నములను వారుచేయకవిడువరు ”

#### తీర్మానము నెగ్గుట

సవరణలును ప్రధానతీర్మానమును ఓటునకు పెట్టగా, సవరణలన్నియు వీగిపోయెను అన్సారిగారి ప్రధాన తీర్మానమే అంగీకరింపబడెను

“దేశస్వాతంత్ర్యమునకై అష్టకష్టములకోర్చి మహాత్యాగ మొనర్చినవారిని యీకాంగ్రెసుసభ అభినందించుచున్నదనియు, దౌర్జన్యరహితమయిన సత్యాగ్రహ వ్రతమునందే భారతజాతికి దృఢవిశ్వాసముకలదనియు, శ్రీమతి సరోజినీ దేవిగారొకతీర్మానమును ప్రతిపాదించిరి అకస్మాత్తుగ అవతలినుండి కొన్ని కేకలవల్ల అల్లరిపుట్టెను కాని కొంతసేపటికి సద్దణిగి సభికులు ప్రశాంతముగ వినసాగిరి

బాబు సంపూర్ణానందగారు మాట్లాడుచు , “కేవలము దౌర్జన్యరహిత సత్యాగ్రహమువలనే మనకు స్వాతంత్ర్యము కలుగునని చెప్పుట కట్టిమాటకము” అనిరి ఈసవరణను దేశపాండ్యాగారు సమర్థించిరి తీర్మానముయొక్క పదముల పొందికను కొంతమార్చవలయునని పురుషోత్తమదాసు టాండనుగారుకోరిరి టాండనుగారి కోరికను సరోజినీదేవిగారు అంగీకరించి తమ తీర్మానముయొక్క శబ్దరచనను సవరించిరి

దౌర్జన్యయుత పద్ధతులకంటె శ్రేష్ఠతరములని ఎంచి దౌర్జన్యరహిత పద్ధతులనే యీసభవారు స్వీకరించుచున్నారని నిర్వచించుచు తీర్మానము సవరింపబడెను

సంపూర్ణానందగారి సవరణ తీర్మానము వీగిపోయెను సరోజినీదేవిగారి తీర్మానమే ఆమోదింపబడెను

శ్రీమతి కమలానెహ్రూగారి అస్వస్థతను గూర్చిన తీర్మానమును అధ్యక్షునిచే ప్రతిపాదింపబడి సభవారిచే ఆమోదింపబడెను

అక్టోబరు ౨౮

నేడు కాంగ్రెసుమహాసభికులు మహాత్ముడు సభకురాగానే సభలోనున్న ఎనుబదివేలమందియును లేచినిలువబడి మహాత్ముని గౌరవించిరి. నేటితో కాంగ్రెసు నాయకత్వమును మహాత్ముడువదలివేయును. ఇప్పటికిని దేశమునందు మహాత్మునిపలుకుబడికొంచమైనను తగ్గలేదు గానిప్పుడు మహాత్ముడు నాయకత్వమును వదలునని వెన్వెంటనే నమ్మజాలకుండెను న్నారు మహాత్ముని ఉపన్యాసమును వినుటకు నేడుమామూలుకంటె ప్రేక్షకులు మిక్కిలి హెచ్చుమందివచ్చిరి మొదట జాతీయగీతములు పాడబడెను. సుభాషచంద్రబోసుగారును జర్మనీనుండికొందరుపంపిన తంతివార్తలను అధ్యక్షుడు చదివెను

నేడు రాత్రి ౧౧ గంటలవరకు అన్ని తీర్మానములును ఆమోదింపబడెను. అందువలన రతవ కాంగ్రెసుమహాసభ నేటితో ముగిసినది. మహాత్ముడు నాయకత్వమును వదలుటవలన పత్యేకవిచారముగానుండినను సభజయప్రదముగా ముగిసినందున సభ్యులందరిలోను ఉత్సాహముతో హర్షధ్వనులొనరించిరి ఈసారి కాంగ్రెసుమహాసభను, గుజరాతు, మహారాష్ట్ర, సంయుక్తరాష్ట్రములవారాహ్వానించిరి ఈతీర్మానముపై వోట్లుతీసుకొనగా అత్యధికసంఖ్యలో జయపురమునకు నిర్ణయించబడెను తీర్మానమును మిక్కిలి హెచ్చు మందిఆమోదించిరి కాంగ్రెసుమహాసభలలో వైభవప్రదర్శనములుండకతప్పదని నిశ్చయింపబడినందున లక్నో వంటి పెద్దపట్టణములలోనే మహాసభజరుపదగునని అధికసంఖ్యాకు లభిప్రాయపడిరి.

౧౯౩౫ ఫిబ్రవరి నెలాఖరున అవసరమహాసభ జరుగవచ్చును అవసరమహాసభజరుపవలెననియే ప్రధాననాయకులునిశ్చయించిరి, ఇండియాప్రభుత్వచట్టము పార్లమెంటులో నుపపాదింపబడినపిమ్మట యీ విషయము నిర్ధారణచేయబడును

నిబంధనలలో మహాత్ముడు సూచించిన సవరణలతీర్మానమునకు సోషలిస్టులు ప్రతిపాదించిన సవరణలు అత్యధికసంఖ్యాకులచే తిరస్కరింపబడెను. మహాత్ముని తీర్మానమామోదింపబడెను.

గృహపరిశ్రమలసంఘము నేర్పరచుటనుగూర్చిన తీర్మానము డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఉపపాదించిరి. పట్టాభిగారు హిందీలో మాట్లాడిరి

“గ్రామములలోనివసించువారు తమయిండ్లలోనే యుండి తీరుబడికాలములలో చేతిపనులనుచేసినచో వారికాదాయము అధికమగును అపుడు గ్రామస్థుల ఆర్థికస్థితి బాగుపడును వారితరులపై నాధారపడవలసినస్థితిలోనుండరు వెనుక గ్రామములలో చాలమందియిట్టి గృహపరిశ్రమలను చేయుచుండిరి ఇపుడు యంత్రముల సహాయమువలన చాలసరకులు తయారుచేయబడుటచే వాటిపోటీకి నిలువలేకుండుటకే గృహపరిశ్రమలసంఘము నేర్పరుపవలెను ఆర్థికశాస్త్రపరిజ్ఞానులలో మిక్కిలిసమర్థుడగు జె. సి. కుమరప్పగారిందులకు పూనుకొనిరి గాంధిమహాత్ముని పర్యవేక్షణక్రింద కుమరప్పగారుపనిచేయుదురు ” అని పట్టాభిగారనుడిరి. ఈతీర్మానమును వదించుటకు అబ్దుల్ గఫూరుఖాన్ గారు ఉపన్యాసవేదికనెక్కగానే సభ్యులందరును గంభీరహర్షధ్వనులొనరించిరి

“స్వరాజ్యమువచ్చిననేగాని నిర్మాణ కార్యక్రమమును సరిగా నెరవేర్చుటకు దేశీయగృహపరిశ్రమలను నెలకొల్పుటకు నుగూడవీలుండదు గాన స్వరాజ్యముకొరకే మనము ప్రయత్నించుచున్నాము అయినను యింతవరకును గ్రామముల అభివృద్ధిని గూర్చి కాంగ్రెసు వారు మిన్నకుండుటకువీలులేదు

* * * * *

గ్రామములలో నున్నగృహపరిశ్రమల నేర్పరచుటవలన నిరుపేదలగు గ్రామవాసులకు ఆహారము లభించుచుండుటయే గాక వారికి రాజకీయపరిజ్ఞానముకూడ కలుగును కావున యీగృహపరిశ్రమల సంఘమునకుమీరందరును మనఃపూర్వకముగా తోడ్పడి యీవిధానమును కొనసాగింపగోరెదను ” అని ఖానుగారనుడిరి జయప్రకాశ్ గారు తీర్మానమునకు ప్రతికూలముగా మాట్లాడిరి “పూర్ణస్వరాజ్యమును బడయుటకాంగ్రెసువారిలక్ష్యము గాని ఫ్యాక్టరీలను పరిశ్రమశాలలను నిర్మించుట వారిపనికాదు స్వరాజ్యమువచ్చిననేగాని పరిశ్రమలనభివృద్ధిచేయుట గ్రామపునర్నిర్మాణము మున్నగుపనులు కొనసాగవు కాంగ్రెసువారిట్టిపనులలో ప్రవేశించినచో వారిశక్తి వ్యర్థమగును కాంగ్రెసు ముఖ్యముగా రాజకీయసంస్థయగుటచే సామ్రాజ్యతత్వమునెదిరించుటకు జనసామాన్యమును సిద్ధపరచుటయే ప్రధానకార్యమని కాంగ్రెసువారు గుర్తింపవలెను ” అని నారనిరి ముందువోట్లుపుచ్చుకొనగా అధికసంఖ్యాకులచే తీర్మానము ఆమోదింపబడెనని అధ్యక్షుడు తెలిపెను

* * * * *

తమాషా

పిల్లలుతప్పిపోయిరని అధ్యక్షుడుపన్యాసవేదికపైనుండి పదేపదే చెప్పుచుండెను ఒక స్త్రీ తనబిడ్డ చేతనుండి తప్పిపోయినదని పదేపదే కోరగా అందరును బిగ్గరగా నవ్వసాగిరి.

* * * * *

కాంగ్రెసుమహాసభ ప్రదర్శన నిర్వహణలు సహకరించినవారికి నీసభవారు కృతజ్ఞులై యున్నారు ఆహారమొసంగుచున్నవారికిని, భారతగృహపరిశ్రమల సంఘమువారికిని వందనములర్పించుచున్నారు ” అను తీర్మానమును అధ్యక్షుడే ఉపపాదించి ఆదిఆమోదింపబడెను

* * * * *

నిబంధనలలో జరుపవలసినమార్పులకు సంబంధించినతీర్మానమును మహాత్ముడే ఉపపాదించును అని అధ్యక్షుడు తెలుపగానే సభయందంతటను గాంధికిజయ్ అను కేకలును హర్షధ్వనులును విస్తారముగా చెలరేగెను

మహాత్మునిఉపన్యాసము ముగియువరకును సభ్యులందరును మౌనమునుబూని యేకాగ్రతతో వినిరి.

మహాసభకు ఆరువేలమంది ప్రతినిధులున్నచో పనిసరిగా జరుగదని అనుభవమువలన తెలుసుకొనగలిగితిమి వాగ్దానపూర్వకముగా కాంగ్రెసుమహాసభజరిగినపుడు ౧౨౦౦౦ మంది ప్రతినిధులు వచ్చిరి గాని వారిలో చాలమంది సక్రమముగా నెన్నుకొనబడినవారుకారు కొన్నిలక్షలమంది సభ్యులకు ౧౦౦౦ మంది ప్రతినిధులుమాత్రమే యుండవలెనని నేనుసూచించితిని గాని ౨౦౦౦ మంది యుండవలెనని ఉపసంఘమున తెలుపుటచే నేనందులకు సమ్మతించితిని స్వరాజ్యమునుమనకులభించునిమిత్తము యీరీతిగా ప్రతినిధుల సంఖ్య తగ్గించుటకు మీరంగీకరింప గోరెదను.

ఇప్పుడు కోటయిలకును ప్రతినిధులకును ప్రత్యక్ష సంబంధము లేదు ఇదియేర్పడవలెను. అప్పుడు అసెంబ్లీసభ్యులకును కోటయిలపక్షమున మాటలాడగలిగినట్లు కాంగ్రెసు సభ్యులు గూడ తమ అభ్యర్థుల పక్షమున మాట్లాడగలుగుదురు దీనివలన స్వరాజ్యము రాదు గాని ఆవిషయమున కాంగ్రెసు అసెంబ్లీకి పోటీగా నుండగలదు

ఇటుపైని రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ కార్యాలయమునందును ఆరాష్ట్రమునందలి కాంగ్రెసు సభ్యుల పట్టీ లుంచబడును వాటిని కాంగ్రెసు యినస్పెక్టరు పరీక్షించుచుందురు ఆరు నెలలకు తక్కువ కాకుండ కాంగ్రెసు సభ్యులుగా నున్న వారికి మాత్రమే వోటింగు అధికారముండును, ౩౦౦మంది కాంగ్రెసు సభ్యులు ఒక గ్రామమున నుండిననేగాని ఆగ్రామమువారు కాంగ్రెసుకు ఒక ప్రతినిధిని ఎన్నుకొనగూడదు అసెంబ్లీకి ౫౦౦౦౦మంది వోటర్లు ఒక ప్రతినిధి నెన్నుకొందురు గాని, కాంగ్రెసు మహాసభకు ప్రతినిధియగుటచే యిప్పుడు ౧౫౦౦మందికి ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొనబడుటకు వీలు కల్పించినాను గ్రామములవారు హెచ్చుమంది కాంగ్రెసులో చేరిననేగాని స్వరాజ్యము రాదుగాన ౩౦౦౦మందిలోను ౧౫౦౦మంది గ్రామములవారు యెన్నుకొనవలెను ౧౦౦౦౦మందికి మించని ఒకసంఖ్యగల గ్రామములు యిద్దరు ప్రతినిధుల నెన్నుకొనవలెను ఒకనికి రావలసినలోటకంటె హెచ్చువోట్లు యితరునకు పంచునట్టి పద్ధతియును గూడనుండును ఇప్పుడు స్థాయి సంఘము ౩౫౦మంది సభ్యులున్నారు కాని స్థాయి సంఘసభలను తఱచు గాజరుపుటకు వీలు లేకున్నది వీరు తరచుగా రావలెనని రాకపోకల వ్యయము లధికమగుచు ఇటుపైని స్థాయి సంఘమున ౧౬౬ మంది సభ్యులు మాత్రమే యుందురు మహాసభాధ్యక్షుని ఎన్నుకొను విషయమున నిప్పుడు రాష్ట్రీయ సంఘములవారు సూచించిన నాయకులలో హెచ్చుసంఘములచే సూచింపబడిన నాయకుని స్వాగత సంఘమువారు అధ్యక్షునిగా నెన్నుకొనుచున్నారు కాని ప్రజాసత్తాకవాదులు దీనినంగీకరింపజాలరు ఇటుపైని మహాసభకు ప్రతినిధులుగా నెన్నుకొనబడినవారే అధ్యక్షుని యెన్నుకొందురు అని మహాత్ముడు మొదట హిందీలో మాటలాడెను సభ్యులకొరకు పైని యింగ్లీషులో గూడ మహాత్ముడు మాటలాడెను. గఫూరుఖానుగారును మున్షిగారును బలపరచిరి ఆ సవరణలను ప్రతిపాదింపగా అవన్నియు వీగెను మహాత్ముని తీర్మానము నెగ్గినది నూలుచందా ఖద్దరుకట్టుట నూలుచందా యున్న గుసన్నిటితోను తీర్మానము పూర్తిగ అత్యధిక సంఖ్యాకులచే నామోదింపబడెనని అధ్యక్షుడు ప్రకటించెను

"గాంధిమహాత్ముని నాయకత్వమునందు మాకు సంపూర్ణ విశ్వాసము కలదని యీసభవారు మరియొకసారి ప్రకటించుచున్నారు మహాత్ముడు నాయకత్వమును వదలుటను గూర్చి పునరాలోచించవలెనని ఈసభవారు నొక్కి విన్నవించుచున్నారు గాని యీవిషయమున మహాత్ముడు తన అభిప్రాయమును మార్చుకొనుట కంగీకరింపనందున విధిలేక ఈమహాసభవారు మహాత్ముని నిర్ణయమును నంగీకరించుచున్నారు భారతీయులకై మహాత్ముడు చేసిన నిరుపమానమగు సేవకు ఈసభవారు గాఢతమమగు కృతజ్ఞతను తెలుపుచున్నారు అవసరమైనపుడు సలహానిచ్చుచుండును నడపించుచుందురని మహాత్ముడు వాగ్దానము చేసినందులకు సభవారు సంతసించుచున్నారు" ఈతీర్మానము యునిసీ నాయగారు ప్రతిపాదించిరి,

"ఆసెంబ్లీ ఎన్నికలకు అభ్యర్థులుగా నిలిచిన కాంగ్రెసు ప్రతినిధులందరును ఎన్నికలలో నెగ్గగలుగుటకు మీరు సర్వశక్తులను వినియోగింపవలెను ఆరీతిగా దేశములో కాంగ్రెసు ప్రతిష్ఠ నిలువబెట్టవలెను" అని అధ్యక్షుడు రాజేంద్రప్రసాదు అంత్యోపన్యాసమును నడిపిరి నేడు సభముగియుననుపుడు సభ్యులలోను ఉత్సాహము మెండైనది. వలంటీరులందరును వేదికచుట్టును బారుదీరి నిలచిరి అధ్యక్షుని నివేదిక పైని నాయకులందరు లేచి నిలువబడిరి. సభలోనున్న వారందరును లేచి నిలువబడిరి, సభ వెలనున్నవారందరును నిలువబడిరి, ఉపన్యాస వేదిక పైనుండి కొంతమంది బాలికలు మృదుమధుర కోమలకంఠములతో వందేమాతరమును పాడిరి సభ్యులు ప్రశాంతముగా వినిరి. "మహాత్మగాంధీకి జై, రాజేంద్రప్రసాదుకు జై" అను జయధ్వనులు లక్షల సామాజికుల కంఠములనుండి గంభీరధ్వనితో వెడలి సరిహద్దుల మారుమ్రోగి అంతరాళమున లీనమయినవి. గాంధిమహాత్ముడు ముందు నడువగా మహాత్ముని పరివేష్టించి నాయకులందరు శిబిరములకు వెడలిరి ప్రేక్షకులు విస్మృతులై మహాత్మునివంక చూడసాగిరి

(అక్టోబరు ౨౮ —)

వర్కింగు కమిటీ నేడుదయము సమావేశమయినప్పుడు కొత్త నిర్మాణవిధానమునందు లోపములు లేకుండ సవరించుపని జరిగెను గాంధిగారు నేడు మౌనదినమగుటచే హాజరుకాలేదు

ఆ బా కాంగ్రెసు సంఘసభ సమావేశమయినప్పుడు ముందుగ అధ్యక్షుడు, నిబంధనల ప్రకారము కార్యవర్గ సభ్యుల పేరను తాను పేర్కొనవలసి యున్నదని చెప్పిరి. ఆకస్మిక వ్యవహార పరిష్కారము వలన యీవిషయమాలోచించుటకు వ్యవధి చాలకుండెననియు ఆసాయంకాలముగాని, మర్నాడు ఉదయముగాని ప్రకటింతుననియు చెప్పిరి

నూతనవిధానము ప్రకారము జిల్లా కాంగ్రెసు సంఘములన్నియు ఏమగునని సాంబమూర్తిగారు ప్రశ్నించిరి నిబంధనలయందు రాష్ట్రీయ సంఘములను గూర్చి యుదహరింపబడినదనియు రాష్ట్రసంఘములకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగబడినందున అవియే జిల్లాసంఘములను గూర్చి నిర్ణయించుకొనవచ్చుననియు అధ్యక్షుడు దెలిపెను.

నూతనవిధానము అమలు జరుపుటను గూర్చి వివరముగ కార్యాచరణను త్వరలో ప్రకటింతుననియు యధ్యక్షుడు దెలిపెను ఇంకను సందేహములు మిగిలినచో వర్కింగు కమిటీవారు నివృత్తి చేయుదురనియు చెప్పిరి.

కాయకష్టపు పనియనగా, స్త్రీలవిషయమున వంటపని గూడ యంగీకరింపబడునా యని సాంబమూర్తిగారడుగగ, కాంగ్రెసుకొరకు వండినచో యంగీకరింపబడునని యధ్యక్షుడనగా సభలో విపరీతముగ నవ్వసాగిరి,

రాజేంద్రప్రసాదుగారు యీ బా కాం సభను ముగించుచు సభ్యులందరును తనకు తోడ్పడినందుకు కృతజ్ఞత చెప్పిరి, యనుకున్నవేళకు సభముగించగలిగినందుకు సంతసము దెల్పిరి

సభ ముగిసినపిదప పలువురు యధ్యక్షుని యభినందించిరి గతమూడురోజులు వర్కింగు కమిటీని ఎదిరించుటలో ప్రాధాన్యము వహించిన టి. ప్రకాశంగారు ముందుగా వేదికపయికేగి యధ్యక్షుని అభినందించి అధ్యక్షుడు నిష్పాక్షికముగ వ్యవహరించెననియు, యభిప్రాయభేదములున్నను తాము వారికి పూర్తిగ తోడ్పడుదుమనియు నచ్చచెప్పిరి

(౧౨వ పేజీ తరువాయి)

ప్రథమలోపముగా పేర్కొనదగినదొకటికలదు. కాంగ్రెసు సేవకులు ధైర్యసాహసములతో విశుద్ధ త్యాగబుద్ధితో శాసనధిక్కారమును చేయజాలక చాటుమాటు పద్ధతులకును కుతంత్రములకును దిగిరి యుక్తివాదములతో ఎదురొడ్డసాగిరి కాని సత్యాగ్రహమనునది కేవలము ధర్మబుద్ధితో ఆత్మబలముతో ఆత్మానందముతో చేయవలసిన మహాత్యాగము కష్టములకొడిగట్టి సంతోషముతో అనుభవింపవలసిన ఆత్మకైంకర్యము తన ఎదిరిపక్షమును సదుపదేశములవల్ల సన్మార్గమునకు త్రిప్పవలెను గాని యుక్తులకు పైయెత్తులు పన్ని లొంగదీయుటవల్ల సత్యాగ్రహియే అధఃపతితుడగును

ఇక రెండవలోప మింకొకటికలదు సర్కారువారొక ఆయువుపట్టును కనిపెట్టి గెల్పొందినను పై ధ్వజ మెత్తియుండిరి జనులు జైళ్లకేగవలెనని స్వేచ్ఛా స్వాతంత్ర్యములను గోల్పోవుటకు సిద్ధమైరి ప్రాణములు పోవునన్నను వెనుకదీయరైరి కాని తమకు విధింపబడిన విపరీతమగు జరిమానాలను వసూలు చేయుటకై తమ ఆస్తిని సర్కారువారు వశపరచుకొనునప్పుడు జనులు దుర్బలహృదయులై వెనుకంజవేయసాగిరి అన్నింటికిని తెగించినవారు అందులకు తెగింపజాలకపోయిరి కనుక సంపూర్ణత్యాగ బలము గలవారు మాత్రమే సత్యాగ్రహమునకు పూనుకొనదగుదని చాటింపబడెను రహస్యకుయుక్తులను మాయోపాయములను సత్యాగ్రహులవలంబించి తమ ఆస్తి వసతులను కాపాడుకొనుటకు యత్నింపకుండ సమర్థులైనవారే సత్యాగ్రహము చేయవలెనని చాటింపబడెను. పూనా ఒడంబడికను, పాట్నా తీర్మానమునను గల హేతువులు పై సందర్భములవల్ల బోధపడగలవు

ఉద్యమ క్షేమముకొరకును దేశ క్షేమముకొరకును సత్యాగ్రహము విరమింపబడవలసివచ్చెను ముఖ్యకారణము మనఆత్మ దౌర్బల్యమే కాని మనమంత్రులకై దిగులుజెందవలసియేమి వివిధమతముల కాలవాలమై భిన్నభాషా ప్రయుక్తమై అతివ్యాప్తమై యున్న యీ భారతవర్షమును విదేశదాస్యమునుండి విమోచనమొనర్చుటకే సత్యాగ్రహోద్యమము సంకల్పింపబడినది ఆసేతుహిమాచల పర్యంతము ఆబాలగోపాలము కాంగ్రెసు సందేశమును శిరసావహించి బద్ధకంకణులై యుద్యమమునకు తోడ్పడిరి ఇంతటి మహాత్యాగమునకు మనసుందరమును ఉపాంగవలసియున్నది. కాని మనకర్తవ్యము మహోన్నతమైనది అతిదుష్కరమైనది కనుక మనలోపములను, మన దౌర్బల్యమును వర్కింగు కమిటీయొక్కయు, అఖిల భారత కాంగ్రెసు కమిటీయొక్కయు అవలక్షణములను గాంధిమహాత్ముని సందేశప్రకటనలను పలువురు తీవ్రముగా విమర్శించుటకు అనేక సందర్భ కారణము లేర్పడినవి మహాత్ముని ప్రకటనలు కొన్ని ముఖ్యసారాంశములను చర్చకు తీసికొనవచ్చునవి. గత ఏప్రిల్ నెల ౭వ తేదిన పాట్నానుండి మహాత్ముడు తొలిన మొదటి సందేశమును పంపెను సత్యాగ్రహమును కాంగ్రెసువారందరు విరమింపవలసినదనియు, తానొక్కడే సత్యాగ్రహమును సాగించెదననియు శాసనసభా ప్రవేశమునందు విశ్వాసముగలవారు అందులకవసరమైన కార్యక్రమము నుపక్రమింపవలసినదనియు తమ ఉపదేశము వెలువరించెను అటుపిమ్మట మే నెలలో అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు పాట్నానగరమందు యీవిషయములను సమగ్రముగా చర్చించి మహాత్ముని ఉపదేశమును స్వీకరించిరి ఆసెంబ్లీ సభకు అభ్యర్థులనుగా కాంగ్రెసు ప్రతినిధులను ప్రవేశింపజేయుటకై కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు తాత్కాలికముగా నెలకొల్పబడెను శ్వేతపత్రవిషయములోను, ప్రభుత్వమువారి నిర్దాక్షిణ్య నిరంకుశత్వవిషయములోను కాంగ్రెసువాదులు అసెంబ్లీసభయందవలంబింపవలసిన వ్యవహారధోరణి ఏకగ్రీవముగా నిర్ణయింపబడెను, అన్నిపక్షములవారును అందులకంగీకరించి తలయూపిరి కాని మన దురదృష్టవశమున ప్రత్యేక ప్రాతినిధ్యప్రణాళిక విషయములో సర్వపక్ష సమన్వయము చేకూరలేదు. రెండవరౌండుటేబిలు సభ ముగిసినపిమ్మట నూతన రాజ్యాంగ శాసనసభయందు యేవిధముగా ఆయా మతసంఘములవారికి ప్రత్యేక ప్రాతినిధ్య ప్రమాణముండవలెనను విషయమును భిన్నసంఘముల ప్రతినిధులు సమాలోచించి నిర్ణయింపవలసినదని ఆంగ్ల ప్రభుత్వమువారు కోరియుండిరి. కాని ఆరౌండుటేబిలుసభకు విచ్చేసిన భారతీయ ప్రతినిధులు తమలోతాము సంప్రదించుకొని సమాంగీకారయోగ్యమైన ప్రాతినిధ్యపద్ధతిని నిర్ణయింపజాలరైరి మనలోమనకు ఒడంబడిక కుదురకపోవుటవల్ల బ్రిటిషు ప్రధానమంత్రిగారే స్వతంత్రించి ఒకప్రాతినిధ్య ప్రణాళికను తయారుచేసిరి. కానియది సర్వవిధముల ప్రజాక్షేమమునకు ప్రతికూలమై జాతీయైకమత్యమునకు అవరోధదాయకమైయున్నది. ఇదిగాక కొన్ని అల్పసంఖ్యాకసంఘములు, అందును ముఖ్యముగా మహమ్మదీయులు ఈప్రాతినిధ్య ప్రణాళిక తమసంఘమునకు శ్రేయోదాయకమని భావించుచు దానిని తిరస్కరించుట కియ్యకొనుటలేదు. హిందువులును, సిక్కులును, మహమ్మదీయులలో కొలదిమంది ప్రముఖులును యీప్రణాళిక తమకు పనికిరాదని నిరాకరించుచున్నారు కాని మహమ్మదీయులలో నధిక సంఖ్యాకులును, తదితర చిన్నసంఘములవారును యీప్రణాళిక లెస్సగానున్నదని ఆమోదించుచున్నారు ఈప్రణాళిక విషయములో భిన్నభావము భేదాభిప్రాయము ప్రబలియుండుటచే సర్వజన సమ్మతమైన మరొక ప్రణాళిక తయారు చేయబడునరకును, కాంగ్రెసు వర్కింగు కమిటీవారు అసెంబ్లీసభ్యులు యగు కాంగ్రెసు ప్రతినిధుల కర్తవ్యమును యీవిషయములో నిదమిత్థమని నిర్ణయింపజాలకున్నారు. కాని యీవిషయమై వాగ్వాదములను, తగవులను యీతరుణములో ప్రేరేపించుట అనుచితమని వర్కింగు కమిటీవారు తలంచి తటస్థముగానుండిరి.

అంతట రాజేంద్రబాబుగారు గతకొలది వారములలో జరిగిన దానిని వివరించుచు, మహాత్ముడు జరిగిన ౧౫ సంవత్సరముల కాంగ్రెసు చరిత్రను పరాలోచన చేసిన దూరదృష్టితో రెండు ముఖ్యసందేశములను ప్రకటింపగోనని చెప్పి ఆరెండింటి భావములను స్పష్టపరచెను మొదటిప్రకటన కేవలము దేశమునకొక సవాలువంటిది రెండవది ఆసవాలునకు ప్రజల ప్రత్యుత్తరమునకు ఫలితము మొదటిప్రకటనలో మహాత్ముడు సత్యము, అహింస, ఖద్దరు అనునవి తన ప్రాణమునకంటెను తనకు ప్రియతరములనెను ......దేశములోని కొందరు యీ ధర్మములను విడిచి క్రొత్త మార్గమును త్రొక్కుటకు యత్నించుచున్నారు ఇట్టి సందర్భములో కాంగ్రెసు సభనుండి తాను విరమించుటయే తన కర్తవ్యమని మహాత్ముడు నిశ్చయించెను, మహాత్ముడు చాలించుకొనునని నే మొదట తలచినప్పటికి తప్పించినను, ఆతను సధర్మబుద్ధితో నేనిట్లు కృతనిశ్చయుడయ్యెనని ఆలోచించుకొనుటచే కాంగ్రెసు మహాత్మునితో వియోగము తనకొక విషాదకర విషయముగ గనబడుటలేదని రాజేంద్రబాబుగారు సమర్థించిరి సమర్థించుచు రాజేంద్రుడు, "మహాత్ముడు తన కార్యక్రమమును నంతయును పూర్ణవిశ్వాసముతో స్వీకరింపజాలని కాంగ్రెసు సభతో ప్రసక్తి విడిచి స్వేచ్ఛగా దేశసేవజేయుటయే మన కెక్కువ క్షేమకరము ఆయన తత్త్వబోధయందు విశ్వాసములేని సంఖ్యాబాహుళ్యముతో ఆయన యుద్యమము సాగింపలేము!" అని చెప్పెను

దౌర్జన్యరాహిత్య సాధనమును ప్రశంసించుచు రాజేంద్రుడు యింతవరకు ఆసాధనమునవలంబించుటచేతనే స్వాతంత్ర్యోద్యమమునకు యిప్పుడింత ప్రతిష్ఠ లభించెననియు, సాధనచే పరిపాలకుల హృదయములనింతవరకును కరిగింపలేకపోయినను తద్విపరీత సాధనముచే, యింతవరకును ప్రభుత్వమువారి చేతులలో అనుభవించియుండిన దారుణహింసలకన్న ఎక్కువైన అమానుష రాక్షస నరకబాధలను పాల్పడియుందుమనియు చెప్పెను.

ఇట్టి దౌర్జన్యరాహిత్య సాధనముచే లభించు స్వాతంత్ర్యలక్షణమును వివరించుచు రాజేంద్రుడు ఒకదేశము నొకదేశము, ఒకదేశములో ఒకతెగ మరియొకతెగను పీడించుట రూపుమాయవలెననియు, స్వలాభార్థమై పరపీడనము నుడుగంట వలెననియు ఇదియే భారతదేశముగోరు స్వాతంత్ర్యమనియు, ఇట్టిస్వాతంత్ర్యము వచ్చినపిమ్మట భారతదేశము కొద్దిపటాలముతో ఆత్మరక్షణజేసికొనగలదనియు, యీసూక్ష్మదృష్టితో చూచినయెడల భారతీయుల సంపూర్ణస్వాతంత్ర్యమునకు బ్రిటిషువారు భయపడవలసినలేదనియు స్పష్టము చేసెను

ఖద్దరు ప్రశంసలో దానివల్ల పల్లెలకును నగరములకును సంబంధమేర్పడుటయేగాక, ధనాఢ్య ప్రాబల్యదోషమునకవకాశము తప్పి అగ్రజాతులకును ఐశ్వర్యవంతులకును నిమ్నజాతులతోను పేదలతోను సన్నిహితసాహచర్యములు అనుసంధితములగునని చెప్పబడెను

మధ్యలో సామ్యవాదులమతము సూచనగా విమర్శింపబడెను. పేదజనులను భాగ్యవంతులు పీడించుచున్నారనియు, సకలవిధములగు ప్రజాపీడనను ఐశ్వర్యాపహరణమును తుదముట్టించవలెననియు సామ్యవాదులు అరచేతిలో వైకుంఠము చూపించువాదలజేయుచున్నారు కాని అహింసాసాధనము యెడ వారికిగల ద్వేషముచే వారిమార్గము ప్రమాదముగలదని రాజేంద్రబాబు చెప్పెను

ఇంకొకప్రకటనలో మహాత్ముడు కాంగ్రెసు మహాసభపనిని సామర్థ్యముతో చేయగలందులకై దాని ప్రతినిధుల సంఖ్యను తగ్గించగోరెను. కాంగ్రెసు హీనసభ్యుల సంఖ్యనుబట్టి కాదనియు వారు చేసినకృషినిబట్టియనియు రాజేంద్రుడు దానిని సమర్థించెను.

## వింతలు, విశేషములు

### ఒకరి కన్ను తీసి మరియొకరికి పెట్టుట

లండను ఆసుపత్రిలోని డాక్టరు ట్యూడరు థామసుగారు చూపుపోయినయొకనికి ఒక చిత్రమైనవిధమున చూపు తెప్పించిరి. వారు చేసిన దేమనగా కన్నుపోయినమరియొకరికంటినుండి ఒక మూలనుకోసి చికిత్సచేయవలసినవానికంటిలో నమర్చిరి. కట్టుకట్టి విడదీసినతర్వాత చూపు మరల యథాప్రకారముగా వచ్చెను. ఇట్లు ఆపరేషనుచే చూపు పొందినవాడు న్యూజీలండు దేశీయుడు.

---

### కొండలు భూమిలో తేలుచున్నవి

హిమాలయపర్వతములును, ఇతర పర్వతములును భూమిలో లోతునను 'ఒకనీటివంటి పదార్థములో, నీటిలోవలెనే తేలుచున్నవని' భూగర్భ విషయశాస్త్రజ్ఞులు యిపుడు క్రొత్తమతమును లేవనెత్తినారు. కొండలు భూమికంటెయెత్తుగా నుండుటకు కారణము నీటిలో తేలువస్తువులు నీటికంటెయెత్తుగానుండుటకు ఏదో అదేనని యిప్పటి వాదము. నీటిలో తేలువస్తువు ఎంత బరువుండునో అంతబరువుగలనీటిని ఆవలికిత్రోసివేయుటకు ఆవస్తువునీటిపై నెంతయెత్తువరకు నుండవలెనో ఆంతయెత్తువరకే తేలును అనికదా సిద్ధాంతము. అదేసిద్ధాంతము పర్వతములు భూమిలో తేలుటకు గూడ సమన్వయమగుచున్నది. భూమిలోవస్తువులను తేలునట్లుచేయుటకు అనుకూలమైన పదార్థము భూమిలోపలికి ౨౦ మైళ్లలోతుకుపోయిననేగాని చిక్కదుఅని భూగర్భశాస్త్రజ్ఞులులెక్కవేసి తేల్చినారు.

---

### లక్ష యేండ్ల క్రిందటివారి అస్థులు దొరుకుట

పాలెస్టైనులో నాజిరెత్‌లో లక్షయేండ్ల క్రిందటివారికి జెందిన అస్థిపంజరములు నాలుగు యిపుడు లభించినవి. చరిత్రవేత్తలు మానవుడు మొదట భూమిలో కనుపించినదిమొదలు మొరటు దశ మొదలగు దశలగుండా పట్టణములు మున్నగువాటిని కట్టుకొని రాజ్యముల నేర్పరచు దశలకు వచ్చునంతవరకు కొన్ని మెట్లను చరిత్రలో విభజించి యున్నారు. అందులో "ప్రాతశిలలకాలము" అనునది ఒకదశ. ఈదశలో మానవుడు రాతితో మొరటుతరహాగా ఆయుధము లు చేసికొని వాటితో మృగాదులనుచంపి జీవించుచుండెనట. ఇందుకునిదర్శనముగా నేడు అక్కడక్కడ ఆకాలపువారు ఉపయోగించిన ఉపకరణ శిథిలశేషములు భూగర్భమున కనబడుచున్నవి. ఇట్టిశిథిలశేషములు అతిప్రాచీనమైనవి కనబడిన తర్వాత ఇంకను లోతుకుత్రవ్వగా పైనచెప్పినట్టి నాల్గు అస్థిపంజరములును కనబడినవట. వీటి యంతప్రాచీనమైనవాటిని యింతవరకు పశ్చిమాసియాలో యింతవరకు త్రవ్వియుండలేదట. మనుష్యుని అభివృద్ధిదశలలో యింతవరకు ఒకదశ తెలియరాకుండెననియు, ఈ అస్థిపంజరములు ఆలోచించినదశను సూచించుచున్నవనియు ప్రొఫెసరు ఆర్థర్‌కీతుగారనుచున్నారు.

---

### పెద్దవైద్యులు, జలుబు కుదుర్చలేరు

ఇంగ్లాండు దేశములో 'బ్రిటీషు మెడికల్ రిసర్చికౌన్సిలు' అనుపేరుతో వైద్య పరిశోధక సంఘమొకటిగలదు. వారు బహుకాలమునుండి సాధారణమైన జలుబుకుమందును కనిపెట్టుటకై పరిశోధనలుచేయుచుండిరి. కాని యిపుడు వారు దీనివల్ల ప్రయోజనములేదని అట్టి పరిశోధనను మానివేసినారట.

---

### ముసల్మానుమతము వదలినందుకు గుర్తు

రంగూనుకుదగ్గఱనుండు మీన్మానార్కోర్టులో ఒకజెర్బాదిబాలిక తాను మహమ్మదీయమతము వదలితినని నిరూపించుటకై ఒకవింతపనిచేసినది. (జెర్బాదిబాలికయనగా భారతముసల్మానుకు స్త్రీకి బర్మాదేశీయునివల్ల పుట్టినదనిఅర్థము) ఆమె ఒక మహమ్మదీయుని పెండ్లాడియుండెను. అతడు తనను కొట్టినను నేరమును ఆమెఅతనిపై మోపెను. ఆమె తనపెదవులమధ్య పందిమాంసము నుంచుకొని తాను ముసల్మానుమతమునకు సంబంధించునదని సూచించెను. భర్తతరఫువకీలు దీనిని ఆమె బౌద్ధమతమునకు మారినదనుదానికి చిహ్నముగా గ్రహించి ఆమెవిడాకులదరఖాస్తునంగీకరించెను.

---

### సొగసులు పనికిరావు

ఇప్పుడుయూరపీయులనాగరికత ప్రపంచమందంతటను వ్యాపించినది. అనేకులు పాశ్చాత్యులవలెనే హ్యాటుబ్యాటు, కాలరున్నెకై మొదలగునవి వారివలె ఆచారమగుటచే కాకున్నను ఆడంబరార్థమై ధరించుచున్నారు. మన దేశములో కూడ పాశ్చాత్య నాగరికతా సంపర్కమువలన కొందరుస్త్రీలుకూడ క్రాపుకత్తిరించుకొనుట మొదలగునవి ఆచరించుచున్నారు. పాశ్చాత్య స్త్రీలలో రోజుకొక ఫ్యాషను. ఈదినం వేషము రేపటికి పనికిరాదు. ఇట్టి ఫ్యాషనులే చైనాలోకూడ వ్యాపించగా, యిపుడు యిట్టివ్యాప్తిని నిరోధించుటకై ఒకక్రొత్త యుద్యమమొకటి లేవనెత్తబడినది. ఈదీనిపేరు "న్యూలైఫ్ మూమెంటు"(నూతన జీవితోద్యమము) ఈయుద్యమమునులేవనెత్తినవారు కేంద్రప్రభుత్వముయొక్కయు రాష్ట్రీయ ప్రభుత్వముయొక్కయు సహాయమునుపొంది చైనాలో స్త్రీలెవరుగాని వెంట్రుకలను అలలుఅలలుగా దువ్వరాదనియు పెదవులకురంగులు వేసికొనరాదనియు, స్త్రీపురుషులుకలిసి స్నానమాడరాదనియు, ఆటలాడరాదనియు, నాట్యము చేయరాదనియు యిరువురుచేతులలో చేతులువేసుకొని వీధులలోపోరాదనియు నిట్టిఅనేకఆజ్ఞలనుగావించినారు. పాశ్చాత్యనాకరికతాభిమానులగు చైనీయులు ఎంతమొత్తుకున్న ప్రయోజనములేకున్నది.

---

### బిడ్డలులేరని భర్తనువదలుట

జీఁహార్లోఅను నామెకుయిపుడు ౨౩ఏండ్ల వయస్సు. ఆమెయిపుడుతనమూడవభర్తయగు హాల్‌రోసర్ అను నతనినివదలివేయుటకు చర్యగైకొన్నది. ఆమెమూడుసార్లు పెండ్లియాడెను. ఒకసారి విడాకుల విచారణలో ఆమె చెప్పినది ఏమనగా అందరుస్త్రీలకు బిడ్డలుకావలెననుకోరికఉండును కదా. కాబట్టి నాకు యింతవరకు ముగ్గురుభర్తలవల్ల బిడ్డలు కలుగలేదు. కాబట్టి నేనువారినివదలివేయవలసివచ్చినది అని ఆమెచెప్పుచున్నది.

---

## ప్రకటన.

యిందుమూలముగా మీకు తెలియజేయునది యేమనగా జి. సత్యనారాయణగారు, స్పెషల్ రిప్రజెంటెటివ్, సికంద్రాబాద్. వారిని కంపెనీ సెర్విసెస్‌నుంచి ౧౯-౨-౩౮ నుంచి తీసివేయడమైనది గనుక కంపెనీ సంబంధమైన వ్యవహారములు వారితో జరుపుటగాని, కంపెనీ సంబంధమైన ద్రవ్యము వారికి యిచ్చుటగాని చేయకూడదు.

బి. నరసింహం,
మేనేజరు.

## గోలకొండపత్రికా కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు

| | |
|---|---|
| హిందువుల పండుగలు | 1-8-0 |
| ఉచ్ఛల విషాదనాటకము | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| జీడికంటిరామ శతకము | 0-1-0 |
| బబ్బూరుపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| రఘునాథ | 0-1-0 |
| చారుమీనారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కార్డు కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు ,, | 2-0-0 |

వలయువారు:—
గోలకొండపత్రికాలయము తూపుబజారు
హైదరాబాదు (దక్కన్).

REG. No. N. 45

Reg. No. M. 2185

STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy